# పీ ఠి క

## I

సీతారామాంజనేయ మనునీప్రబంధము రచించినకవి పరశు రామపంతుల లింగమూర్తి. ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. రామ మంత్రి తిమ్మమాంబల కుమారుఁడు. ఇతనినివాసస్థలము నిజామురాష్ట్రము లోని వరంగల్లునకుఁ జేరిన మట్టెవాడ. నేఁటివఱకీకవివంశీయులు లింగమూర్తి కవిపాదరజముచే బవిత్రీకృతమైన ప్రాచీనగృహమునసె వసించుచున్నారు. ఈవంశమున నీయనకుఁ బూర్వము కవు లున్నటులఁ దెలియదు. ఆంధ్రమున నీకవివర్యుఁడు రచించినగ్రంథములఁ జేర్కొం దుము.

1. రతిమన్మథవిలాసము
2. జీవన్ముక్తిప్రకరణము
3. బ్రహ్మనారదసంవాదము
4. తారకయోగము
5. మానసశతకము (కందములు)
6. సీతారామాంజనేయము

ఇందు సీతారామాంజనేయము, రతిమన్మథవిలాసము అను రెండు గ్రంథములే యించుక పెద్దవి. మిగిలినకబ్బములు శతకప్రాయములు. రతిమన్మథవిలాసము మూఁడాశ్వాసముల ప్రబంధము. ఈగ్రంథము కవి బాల్యమున రచించినటుల నందలిభావలోపములు వ్యాకరణలోపములు సాక్ష్యము లగుచున్నవి. గద్యములో "శ్రీమదాంజనేయచరణకమల సేవావిధేయ శృంగారకవితాచమత్కారధౌరేయ పరశురామపంతుల లింగమూర్తినామధేయప్రణీతం బైనరతిమన్మథవిలాస మను శృంగార ప్రబంధమందు" అని వ్రాసికొనియున్నాఁడు. దీనింబట్టి యౌవనమున నీగ్రంథము కవి రచియించియుండు నని తేలుచున్నది. సీతారామాంజ నేయము లిఖించునప్పటికి కవిస్థితిగతులు మాఱెను. ఈతనిమానసము

శృంగారరసమునుండి విముఖులై వేదాంతరసమున నోలలాడఁ దొడఁగెను. కవితయు నిగ్గుదేఱి వశంవదయై భావబింబముల నిర్దిష్టచ్ఛాయాంశములలో సైతము చిత్రించుశక్తి కల దయ్యెను. రతిమన్మథవిలాసము హనుమంతునకుఁ గృతి యీయఁబడినది. గద్యమున హనుమన్నిష్ఠుఁడ నని కవి చెప్పికొనెను.' గ్రంథమున గురుప్రశంస లేదు. తుదను స్వవంశ విషయమేని చెప్పికొనియుండలేదు. సీతారామాంజనేయ మీకవి తన యుత్తరవయస్సున రచించియుండును. ఇందులకుఁ గవితాధారయు వేదాంతపాండిత్యము మనకు దృష్టాంతములు కాఁగలవు. ఈకవి బాల్యమున సామాన్యునివలె విద్యాజ్ఞానశూన్యుఁడై తన గ్రామమగు పుట్లవాడకు సమీపమునసున్న "ఈదులవాయ" యనుగ్రామమున సంచరించుచుండ సమీపశైలమున వసించు మహాదేవయోగి యను నొక మహాత్ముఁడు రామమంత్రోపదేశ మొనరించె ననియు, నాగిరియందె యామంత్రరాజము సిద్ధించువఱకు వసించి యోగివలని సెలవంది యాయన దయచేసిన షట్చక్రసీతారామస్వరూపము నిజగృహమునఁ బ్రతిష్ఠించె ననియుఁ జెప్పుటయేకాక నేఁటివఱకు నాసీతారామమూర్తిస్వరూపము వంశీయులు భక్తితాత్పర్యములతోఁ బూజించుచున్నారు. కవి, తాను మహాదేవగురుశిష్యుఁడ ననియు, షట్చక్రసీతారామోపాసకుఁడ ననియు సీతారామాంజనేయగద్యమున నిటుల "శ్రీమన్నారాయణ మహాదేవగురుకరుణాకటాక్ష వీక్షణావిమలీకృత నిజహృదయకమలకర్ణికాంతస్సందర్శితాఖండ సచ్చిదానందనస్తైకమూర్తిషట్చక్రసీతారామమూర్తి పరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తి ప్రణీతము" అని వ్రాసికొనియున్నాఁడు. మఱియు నీకవివర్యుఁ డార్జించిన శ్రీరాముమాడయు స్ఫటికవినాయకవిగ్రహము మరకతలింగము సాలగ్రామములు సైతము వంశీయులు శ్రద్ధాభక్తులతోఁ బూజించుచున్నారు. ఎట్టివిపత్కాలమునసేని తాఁ గడించినవిగ్రహముల మట్టివాడయందుంచియే పూజింపవలయు నని కవి యాజ్ఞయొసంగెనఁట. నేఁటికి వంశజు లటులే సల్పుచున్నారు. కవికి గురుమూర్తిపదము బిరుదనామము. ఇది యిక్కవి రామమంత్రోపదేశకుఁడై నిజామురాష్ట్రమున నఖిలదిశలఁ బల్లకి నెక్కి తిరిగి పెక్కండ్రు శిష్యుల గడించి వారివలనఁ బొందెనఁట.

కవి తనగురుపరంపర నిటులఁ జెప్పికొన్నాఁడు.

శ్రీదత్తాత్రేయుఁడు
|
జనార్దనయోగి
|
ఏకనాథగురుస్వామి
|
సహజానందమహేశగురుస్వామి
|
నాగోజీరామగురుఁడు
|
కోనేరుగురుఁడు
|
మహాదేవగురుఁడు.

ఇందు కడపటివాఁడగుమహాదేవగురుఁడే ప్రకృతకవి కుపదేశ మొనరించిన దేశికుఁడు. ఈదేశికనామము రతిమన్మథవిలాసమునఁ గాన రామిచే నప్పటి కీకవి భక్తియోగాభ్యాస మొనరించియుండఁ డని తెలియుచున్నది. సీతారామాంజనేయమునఁ దనదేశికు నిటుల స్తోత్ర మొనరించియున్నాఁడు.

సీ. "అఖిలభూతంబుల నాడించుమాయను
 సొంపుగా నెవ్వఁ డాడింపుచుండు
గురుజనంబుల కెల్ల గురువులై తగుహరి
 హరుల కెవ్వఁడు గురు వగుచునుండు
విబుధలోకంబుల వెలిఁగించి వెలుఁగుల
 మించి యెవ్వఁడు వెలిఁగించుచుండు
ప్రభువుల కెల్ల సత్ప్రభు వైన బ్రహ్మకుఁ
 బ్రభు వౌచు నెవ్వఁడు పరఁగుచుండు

తే. సగుణనిర్గుణరూపుఁ డై యెగడుచుండు
నమ్మహాదేవగురువరు నభినుతింప
సకలనిగమాగమాంతశాస్త్రంబు లోప
వసఁగ మముబోంట్లకు నుతింప నలవి యగునె?"

ఈపద్యమువలన మహాదేవయోగి దైవసముఁ డని తోఁచు చున్నది. ఎంతవాఁడో కానిది లింగమూర్తికవికి గురువు కాఁగ లఁడా! కవి తాను, మహాదేవయోగి గురుఁ డని యిట్లు చెప్పి కొనెను.

తే. "అమ్మహాదేవగురుచరణారవింద
వరపరాగాంశభజనతత్పరుఁడఁ బరశు
రామపంతులకులజాతరామమంత్రి
మాళితిమ్మాంబికా ప్రియాత్మజుఁడ నేను."

కొండొకచోట నిక్కవి తనదేశికుని సీతారామస్వామికి సమా నునిగ నీక్రిందిపద్యములోఁ జెప్పికొనియున్నాఁడు.

క. "ప్రణవాత్మకసదసత్కా-
రణసంపూర్ణప్రభాభిరామసగుణని
ర్గుణనిర్వికారనారా
యణసీతారామగురుమహాదేవశివా!"

కవి తా నీగ్రంథమున బ్రహ్మాండపురాణాంతర్గతమగు అధ్యాత్మ రామాయణమునందలి శ్రీరామహృదయమును విస్తరించి వ్రాసితి ననియు శ్రీరాముఁడు స్వప్నమునఁ బ్రత్యక్షమై కృతి రచింపు మనె ననియు వ్రాసికొనియున్నాఁడు.

ఈకవి యీగ్రంథమును మూఁడాశ్వాసములుగ విభజించి క్రమముగఁ దారకయోగము, సాంఖ్యయోగము, అమనస్కయోగము అని పేరులఁ బెట్టియున్నాఁడు.

రజతగిరియందు శంకరుఁడు పేరోలగముఁ దీర్చియుండఁగుతఁ దనపరిచర్యలయం దప్రమత్తురాలగు పార్వతినిఁ జూచి శంకరుఁడు

సంతసించి నీ యభీష్టంబుఁ దీర్తు నెద్దియేని వరము కోరు మనె నఁట. అందులకుఁ బార్వతి పవిత్రమగుమంత్రరాజ ముపదేశింపుమనికోర శంకరుఁడు నీకుఁదగినది శ్రీరామమంత్ర మని దాని నుపదేశించెనఁట. పిమ్మట పార్వతి శంకరునిఁ జూచి శ్రీరామతత్త్వస్వరూప మెట్టి దని ప్రశ్నింప, శ్రీరాము ననుమతిచే సీత హనుమంతున కెఱింగించిన యంశము శంకరుఁడు పార్వతి కెఱిగించెనఁట. ఇదియే యీగ్రంథావతారిక.

కవికాలము తెలిసికొనుటకు గ్రంథమున నాధారములు లేవు. రతిమన్మథవిలాసము కవిస్తుతిలో అయ్యలరాజు రామభద్రుని పేర్కొని యుండుటచే పదునాఱవశతాబ్దమునకుఁ గడపటివాఁ డనువిషయము స్థూలదృష్టికిఁ దోఁచును. కవికిఁ గడపటివంశవృక్ష మీక్రిందివిధముగ నున్నది.




ఈవంశవృక్షమునందలి పట్టాభిరామయ్య గ్రంథకర్తయగు లింగమూర్తికవి కైదవతరమువాఁడు. ఈపట్టాభిరామయ్యకు వయస్సు 40 సంవత్సరము లుండును. ఈయనవద్దనుండి తరమునకు ముప్పదియేండ్ల చొప్పున లెక్కించినచో ప్రకృతకవి యిప్పటికి రమారమి 150 సంవత్స

త్సరముల పై కాలమువాఁ డగును. అధ్యాత్మ రామాయణము, శుకచరిత్రము లోనగు గ్రంథముల విరచించిన మహాకవియు లింగమూర్తికవి కుమారుఁడు శిష్యుఁడు నగు రామమూర్తి తనతండ్రి లిఖించిన రతిమన్మథవిలాసమునకు శుద్ధప్రతి వ్రాయుచుఁ గ్రింద, "ప్లవంగసంవత్సర జ్యేష్ఠ బ ౧౩ గురువారమువఱకు పరశురామపంతులురామన్నగారు రతిమన్మథవిలాసము పూర్వప్రతిలోనున్న క్రమాన వ్రాసిరి." అని వ్రాసికొనెను. జీర్ణమయమై యున్నగ్రంథమువలనను, ప్రకృత వంశీయులకు రామమూర్తికవి నైదవపురుషుఁ డగుటవలనను ప్లవంగసంవత్సర మిప్పటికి బదియేండ్లక్రిందను డెబ్బదియేండ్లక్రిందను గతించినది కాక నూటముప్పదిసంవత్సరముల క్రింద గతించినదై యుండును. అంతకు ముందు లింగమూర్తిగారు రమారమి యిరువదిసంవత్సరముల క్రింద నుండె ననుకొనినను సీతారామాంజనేయ మిప్పటికి నూటయేఁబది సంవత్సరముల క్రిందః—అనఁగా క్రీ. శ. 1760 ప్రాంతములలో విరచింపఁబడియుండు ననుట నిస్సందేహము. కవిజీవిత మింక విడిచి కావ్యము విమర్శింతము.

## సీతారామాంజనేయసంవాదము

ఇది యితనితక్కిన గ్రంథములకంటె శ్రావ్యముగఁ శ్లాఘ్యముగ నిర్దుష్టముగా నున్నది. కావ్యమంతయు యోగశాస్త్రమగుటచేఁ గవితావిమర్శమునకు వీలు కానరాదు. అందందుఁ గలస్వతంత్రపద్యములచేఁ గవిశక్తిసామర్థ్యములు గుర్తింపవచ్చును. ప్రాచీనకవులపద్యముల పోలికల ననుసరించి వ్రాయఁబడినపద్యములు కొన్ని సీతారామాంజనేయమున కలవు.

సీ. "స్వామియై నిగమాతిభూమియై సురపురో
గామియై యబ్ధిజాకామి యుండ
హారియై హాలహాలాహారి యై భవదంశు
ధారియై ప్రసవాయుధారి యుండ......"

వసుచరిత్రము, చతుర్థాశ్వాసము. ప-36

సీ. "ఏకమై పరమై విశోకమై సత్యమ
లోకమై వ్యాపకాలోక మగుచు
సారమై చిదచిదాకారమై యతినిర్వి
కారమై విగతసంసార మగుచు......"
సీతారామాంజనేయము ఆ-2 ప-6.

ఉ. "హా యను గాధినందనమఖారినిశాటమదాపహారి బా
హా యను ప్రాణజీవదపదాంబుదహా యను రాజలోకసిం
హా యనుఁ బోషితార్యనివహా యనుఁ గానల కేఁగితే నిరీ
హా యను నిర్వహింపఁగలనా? నిను బాసి రఘూద్వహా యనున్."
రామాభ్యుదయము ఆ-5 ప-10.

ఉ. "మాయను మిథ్యగాఁ దెలియుమా యను దత్కృత మెల్లఁ గల్లసు
మ్మా యను మేను నే ననకుమా యను సాక్షిని నీవు చూచుకో
మ్మా యనుఁ జూడఁగా నితరమా యను నే నని నిశ్చయించుకో
మ్మా యనుఁగాకపో నితరమా యనుమానముమానుమాయనున్."
సీతారామాంజనేయము ఆ-2 ప-143.

ఇట్టిపోలికలచే నీకవి ప్రాచీనకవులకవిత్వముపై గౌరవభావము కలవాఁ డనియు రసార్థి యనియుఁ బాఠకులు తలంతురుగాక. కఠినతమ మగు వేదాంతశాస్త్రమును, కవితాప్రపంచమున వెలయించుట సామాన్యకార్యము కాదు. అందును నీకవి వర్ణనాంశములలో నిరోష్ఠ్యపద్యములు, సర్వతఃప్రాసపద్యములు, చతుఃప్రాసపద్యములు వ్రాసి తనశక్తిని వెల్లడించియున్నాఁడు. విస్తరభీతిచే నుదాహరింప మానితిమి. ఈలింగమూర్తికవిమొదలు కడకు వంశవృక్షములోనివారందఱును కవులుగను పండితులుగను రామమంత్రోపాసకులుగ నున్నారు. ఈ పవిత్ర మగువంశమునఁ బట్టాభిరామయ్యగారును వారిపుత్త్రులును గవితాపరిచయములేనివారుగ నున్నారు. ఈసీతారామాంజనేయమునకు సర్వాంకషముగ మొదట వ్యాఖ్యానమొనరించిన శ్రీపాలపర్తి నాగేశ్వర

శాస్త్రినిగూర్చిన విశేషాంశములు తెలియరావు. సీతారామాంజనేయమువలెనే యీకవి రచించిన రతిమన్మథవిలాసముకూడ ముద్రించి భాషాలోకమున కుపకృతి యొనరింప శ్రీవావిళ్లవారి నడిగికొనుచుం బ్రకృతాంశమును ముగించుచున్నారము.

ఇట్లు భాషాసేవకులు,

శేషాద్రిరమణకవులు, శతావధానులు.

# పీఠిక

## II

దేశవిప్లవములలో మహారాష్ట్రదేశమునుండి దండాపంతు శ్యామాపంతు, పరశురామపంతు అను ప్రముఖులు తెలుఁగుదేశమున వసతు లేర్పఱచికొని యిచటకుఁ బ్రాంతకాపులైరి. వారిలోఁ బరశురామ పంతు వంశజులు పరశురామపంతులవా రనునింటిపేరుతో వ్యవహరించుచు ఓరంగల్లునకు దాదాపుగ మూఁడామడల దూరమునం దున్న సెనగరమునందు వృత్తిస్వాస్థ్యము లేర్పఱచికొని సమీపస్థులగు నియోగులతో సంబంధబాంధవ్యములు జరిపి నియోగులుఁగ వ్యవహరింపఁబడిరి. ఈవంశముననె ప్రకృతికవిరత్న మగు లింగమూర్తి జనించి ప్రసిద్ధి నొందెను.

ఆంధ్రులలోఁ గలసిపోయి యాంధ్రవాఙ్మయవిశేషముల నభ్యసించి యాంధ్రత్వము గడించిన యీవంశముపూర్వవివరములు విశేషించి తెలియరావు. ఇందుఁ బ్రసిద్ధుఁ డగు సీతారామాంజనేయగ్రంథ కర్త యగు పరశురామపంతులలింగమూర్తి కులగోత్రాదికములు స్వరచిత గ్రంథములు నిక్కావిగ్రంథాంతరములలోఁ బేర్కొనకున్నను గవివంశజులవలన లభించిన తాళపత్రగ్రంథసముదాయమువలనను, వంశజులు చెప్పువృత్తాంతమువలనను ఈక్రిందివిధముగఁ దెలియుచున్నది.

"లింగమూర్తి బాల్యమున గురుకులవాసముచేసి సంస్కృతాంధ్రములలో మంచిపాండిత్యము గడించి తొలుత "రతిమన్మథవిలాస" మను మూఁడాశ్వాసముల శృంగారకావ్యము రచించెను. అనంతర మాధ్యాత్మికగ్రంథపఠనమువలన నైహికములపయి విరక్తి యుదయింప సద్గురు నాశ్రయించి మంత్రోపదేశముఁ బడయఁ గోర్కి జనించెను. లింగమూర్తికిఁ గలయాసక్తి విని మహానుభావుఁడును మహాదేవగురుశిష్యుఁ

డును నగు కుసుమనారాయణుఁ డనుభక్తుఁడు లింగమూర్తినిఁ దనయింటికిఁ రావించి తారకయోగము నుపదేశించెను. తాను సాలెకులజుఁడగు గాన బ్రహ్మవంశజుఁ డగులింగమూర్తి కిశ్రీరామమంత్ర ముపదేశింపను యందులకుఁ దగినవాఁడు మహాదేవగురుఁడుగాన నతని నాశ్రయింప మంతెనకుఁ బొమ్మని చెప్పెను. లింగమూర్తి మనసు పరిశుద్ధము చేయను తారకయోగముకతనఁ బరమార్గము దెలిసికొన నుత్సాహముకలవాఁడై మహాదేవగురువర్యులసన్నిధి కేఁగ సంకల్పించి మంతెన కేఁగి యట దర్శించి శ్రీరామమంత్రోపదేశము నొందెను. కొన్నాళ్లు గురుకుల వాసముచేసి లింగమూర్తి యటనుండి సెలవు గైకొని సమీప మున నున్నపుణ్యక్షేత్ర మగు రామగిరిదుర్గమునఁ కేఁగి యచటఁ బురశ్చరణము గావించెను. శ్రీరాముఁడు బ్రాహ్మణరూపమున సర్మన మొసంగి ఒక బంగారు శ్రీరాముమాడయు స్ఫటిక వినాయకవిగ్రహమును మరకతలింగము సాలగ్రామము సీతారామమూర్తివిగ్రహమును నొసంగి వీనిని స్థానచలనము గావింపక గృహమున నుంచి పూజింపుము. సప్త పురుషాంతరములవఱకు నీయింట నివి యుండి సమస్తశుభములు ప్రసా దింపఁగల వని సెలవిచ్చి యదృశ్యమయ్యెను. లింగమూర్తి యప్పుడు ఒరంగల్లునకుఁ జేరిన మట్టెవాడకువచ్చి గృహనిర్మాణము గావించి యం దీయర్చాస్వరూపములఁ జేర్చి పూజించుచు గ్రంథరచన మొనరించి రాజ యోగానుసారముగ జీవితమును గడిపెను. నాఁటినుండి నేఁటివఱకు నీ యర్చామూర్తులకు వంశజులు స్థానచలన కలిగింపలేదు. లింగమూర్తికవి కిపుడు ఏడవపురుషాంతరము గడుచుచున్నది. లింగమూర్తి సమాధి స్వగృహమునకు మిగులఁ జేరువలో నరసంపేటపోవు రాచబాటకు నావల నున్నది. గడచినతరమువఱకు సమాధికడఁ బూజాపురస్కారములు జరిగెడివి.”

ఇది కవివంశజులకడ మేముగ్రహించినవాఙ్మూలము నకు సారము. లింగమూర్తి పేర్కొనిన నారాయణగురువు వృత్తాంతము సమగ్ర

ముగ నెఱుంగుట కీవంశజులనివేదిక చాలవఱకు తోడ్పడఁగలదు. లింగమూర్తి సీతారామాంజనేయాదియందుఁ జెప్పిన

క. ఆరయ మద్బాల్యంబున
గారవమునఁ జిత్తశుద్ధికరముగ నాకుఁ
దారక యోగము దెలిపిన
నారాయణగురువులను మనంబునఁ గొలుతున్.

అను పద్యమునందలి గద్యమునందలి నారాయణగురువృత్తములు గ్రహింప వంశజులనివేదికతప్ప ఇతరాధారములు లేవు. లింగమూర్తి భార్య లింగమాంబ, తండ్రి శ్రీరామమూర్తి, తల్లి తిమ్మమాంబ. ఈయన భారద్వాజగోత్రుఁడు, ఆశ్వలాయనసూత్రుఁడు. ఈకవి కృతగ్రంథములలో నీ క్రిందివి లభించినవి.

1. రతిమన్మథవిలాసము
2. జీవన్ముక్తిప్రకరణము.
3. నారదపరమేష్ఠి సంవాదము
4. సాంఖ్యయోగము
5. తారకయోగము
6. మానసశతకము
7. సీతారామసంవాదము [సీతపాట]
8. సీతారామాంజనేయము.

ఇందుఁ గడమ రెండుగ్రంథములు మాత్రమె మాయెఱింగినంతలో ముద్రితములు. రతిమన్మథవిలాసము సీతారామాంజనేయము దక్క మిగిలిన గ్రంథములు శతకప్రాయములు. రతిమన్మథవిలాసము ప్రథమగ్రంథమనుట కంటే కొన్నియాధారములు గలవు. ఇందు ధారాశుద్ధి కొంచెత వడియున్నది. భావలోపములు వ్యాకరణలోపములు కొన్నితావులఁ గలవు. గద్యము: "శ్రీమదాంజనేయ చరణకమలసేవావిధేయ శృంగార కవితాచమత్కారధారేయ పరశురామపంతుల లింగమూర్తినామధేయ

ప్రణీతం బైన రతిమన్మథవిలాసం బను శృంగారప్రబంధమందు" అని వ్రాసికొనెను. దీనింబట్టి యౌవనమున రతిమన్మథవిలాసము రచించెనని తోఁచును. ఇంతియగాక యందు గురుప్రశంసలేదు. వంశవర్ణనము లేదు. గ్రంథము హనుమదంకితము. సీతారామాంజనేయము రచించునాఁటికిఁ గవి చిత్తవృత్తి మాఱెను. తన గురుఁడగుమహాదేవుఁడు శ్రీరామ రూపమున గోచరించెను. కవితాధార నిగ్గుదేరెను. వేదాంతపాండిత్యము గురుసేవచే నభివృద్ధియయ్యెను. అందుచే సీతారామాంజనేయము సర్వవిధముల నుత్కృష్టగ్రంథ మని చెప్పవచ్చును. ఆంధ్రవాఙ్మయమునఁ గల వేదాంతగ్రంథములలో దీని కున్నంత ప్రశస్తి మఱే యేగ్రంథమునకును లేదు. దుర్గ్రాహ మగు వేదాంతరహస్యము మృదుమధురపదరచనమున నిమిడించి కవిత్వము నమృతప్రాయ మొనరించిన లింగమూర్తికవి రసికజనుల కారాధ్యుఁడు. గ్రంథకర్త తనగురు పరంపర నిట్లు చెప్పుకొన్నాఁడు.

శ్రీదత్తాత్రేయుఁడు
|
జనార్దనయోగి
|
ఏకోగురుస్వామి
|
నరహరిమహేశగురుస్వామి
|
నాగోజిరామగురుఁడు
|
కోనేరుగురుఁడు
|
మహాదేవగురుఁడు

(కుసుమ) నారాయణుఁడు తారకయోగ మెఱింగించిన గురువైనను గురుపరంపరలోనివాఁడు కాఁడు. ఇందు జనార్దనుఁడు మహావిద్వాంసుఁడనియు ఏకోగురుస్వామి గీతశాస్త్రాదికమునకు వేదతుల్యము లగు భాష్యములు రచించినవాఁ డనియుఁ గవి చెప్పెను. నేఁ డాభాష్యములు గోచరింపకపోవుట సంతాపకరము. కుసుమనారాయణయు మహాదేవుఁడును గవు లని యిక్కవికొండొకచో పేర్కొనెను. వారికవితాజీవితము మృగ్యము. కవికి మంత్రోపదేశము గావించిన మహాదేవయోగి పలుతావుల సీతారామపరబ్రహ్మముతో నభేదముగఁ జెప్పఁబడుటచే గొప్ప విజ్ఞానముగలవాఁ డని తోఁచుచున్నది. ఈమహాదేవయోగి సన్న్యాసియేమొ యని యీక్రిందిపద్య మనుమానింప నాస్పదమగుచున్నది.

సీ. కమనీయవరదివ్యకాంచనచేలంబుఁ గాషాయవస్త్రంబుగా గ్రహించి

చూ. ప్ర. ఆ. పద్యము 16.

మహాదేవయోగివివరములు మంతెనలో లభింపవచ్చును. అచ్చట నీయనసమాధి గల దని కొందఱు చెప్పుచున్నారు. ప్రత్యేకశ్రద్ధతీసికొన్నఁగాని వివరములు తెలియవు. లింగమూర్తికి గురుమూర్తిబిరుదము గలదు. ఇది సర్వత్ర యీతనిగ్రంథములలోఁ గాననగును. వేదాంతపాండిత్యము గడించి శ్రీరామమంత్రోపదేశము నొనరించుచు నీమహాత్ముఁడు శిష్యవత్త మగుగురుమూర్తినామముతో సుప్రసిద్ధివహించిన కొలఁది జన్మనామమగులింగమూర్తినామము మఱుగుపడెను. క్రమముగ నిక్కవికి గురుమూర్తి యనునదియె వ్యవహారనామమై నటుల నీయన పుత్త్రుఁ డగురామమూర్తిగ్రంథములవలనఁ దెలియును. సీతారామాంజనేయము ప్రౌఢభాషలో నుంటచే స్త్రీబాలపామరులకు బోధ కాఁజాల దని లింగమూర్తికవి ఏనూఱుచరణములతో నొకగీతముగ రచించి లోకోపకారము గావించెను. ఈగీతము నేఁటికిని బహుముఖాగతమై దుష్కరవేదాంతాధ్యయనమునకు సుగమ మగు త్రోవఁ జూపుచున్నది. కృత్యాదియం దీక్రిందివిధముగా నందుఁ గలదు.

అవనినారాయణమహాదేవు లిరువు రొగి
నవతరించిన యట్లు తనరి
ప్రవిమలత మెఱయు నారాయణమహాదేవ
కవుల సద్గురువుల నుతించి
ఆ_స్తనత్రుణకళాస్ఫూ_ర్తి యగు శ్రీలింగ
మూ_ర్తి గురుమూ_ర్తి యొకనాఁడు
ఆర్తులకు బ్రహ్మవిద్యారహస్యార్థంబు
కీ_ర్తించి రక్షింపఁదలఁచి
వరుసతో నేనూఱువాక్యములు ముత్యాల
సరులు గూర్చినభంగి గూర్చి
సరససీతారామసంవాద మనుపాట
విరచించె జనులార వినుఁడి.

స్వరూపమునఁ జిన్నదయ్యు గుణబాహుళ్యముచే నిలుసఁగల యీయు_త్తమగ్రంథము ముముక్షువుల కవశ్యముగఁ బఠనీయ మను టలో సంశయము లేదు.

సీతారామాంజనేయము మూఁడాశ్వాసముల గ్రంథము. ఇందు మొదటి యాశ్వాసమునందుఁ దారకానుభవవిచారము రెండవయాశ్వాసమునందు సాంఖ్యయోగానుభవవిచారంబును మూఁడవయాశ్వాసమునందు అమనస్కయోగానుభవవిచారంబును జెప్పఁబడినవి. సీతారామాంజనేయ మూలకథాంశము: "ఇప్పు డీవు బ్రహ్మాండపురాణమునం దధ్యాత్మరామాయణం బుమామహేశ్వరసంవాదరూపంబై యొప్పు, నందు శ్రీరామహృదయం బను నితిహాసంబు సీతారామాంజనేయసంవాదమునఁ బ్రవ_ర్తిల్లు, నది సంక్షేపరూపంబు గావున నయ్యర్థంబు వి_స్తరించియొక్క ప్రబంధంబుగా రచించి నాపేర నంకితంబుసేయుము" (ప్ర. ఆ. 19 చూ.) అనువచనమువలన స్పష్టము.

రజతగిరియందు శంకరుఁడు పేరోలగముఁ దీర్చియుండుతఱిఁ దన పరిచర్యలయం దప్రమత్తురాలగు పార్వతియెడఁ దృప్తుఁడై శంకరుఁడు నీయభీష్టము దీర్తును. వర మెద్దియేని కోరుకొను మనెను. అందులకుఁ బార్వతి పవిత్రమగు మంత్రరాజము నుపదేశింపు మని కోరుకొనెను. శంకరుఁ డంత సతీ! నీకుఁ దగినది శ్రీరామమంత్ర మని యుపదేశించెను. పిదపఁ బార్వతి శంకరుని దిలకించి శ్రీరామతత్త్వస్వరూప మెట్టి దని ప్రశ్నింప శ్రీరాము ననుజ్ఞచే సీత యాంజనేయున కెఱింగించిన యంశము, శంకరుఁడు పార్వతి కెఱింగించెను. ఇదియే యీ గ్రంథావతారిక.

లింగమూర్తి తనకుఁ దారకయోగ ముపదేశించిన నారాయణుని, మంత్రోపదేశము గావించిన మహాదేవగురుని హరిహరు లని తన గ్రంథాంతరములఁ బ్రశంసించినాఁడు. ఈకవి తన కిష్టదైవస్వరూపముగఁ బ్రశంసించిన పట్టాభిరామస్వరూప మగుసాలగ్రామము మున్నగు పేర్కొనిన తదితరములగు సర్వావిగ్రహములు నేఁటికిని షట్టివాడ (ఒరంగల్లులో నొకభాగము)లోఁ గవివంశజులస్వాధీనమున నుండి సంరక్షనయోగ్యములుగ నుండె ననుట సంతోషావహమగుసంశము.

లింగమూర్తికవిత ప్రౌఢ మైనది. నిర్దుష్ట మనియే చెప్పవచ్చును. కొన్నితావులఁ బూర్వకవుల ననుసరించి యిక్కవి విశేషించి శబ్దాలంకార ముల నుపయోగించినాఁడు. వివిధవృత్తములకుఁ దావొసంగినాఁడు. భావ మగమ్యమైనను బద్యము మాత్రము హృదయరంజకముగ శ్రుతి మనోజ్ఞముగనుంటచే వేదాంతశాస్త్రానుభవదృష్టితోఁగాక కావ్యదృష్టితోఁ గూడఁ బలువురు దీనిని బఠించుచున్నారు. రెండవయాశ్వాసములోని 145—150 వఱకుఁగల సర్వతఃప్రాసనీసములును, ప్రథమాశ్వాసము లోని 138—139 సంఖ్యగల దీర్ఘసమాసబంధురపద్యములు 148 సంఖ్యగల వచనమునందలి యుక్తికాంతను గొంతగ రూపించిన వచనము జూచిన యిక్కవి కవితాపాటవము వేద్యము కాఁగలదు. కొన్నియెడల

శబ్దాలంకారములపట్ల పూర్వకవుల ననుకరించినటులఁగూడ గోచరించు భాగములు కలవు.

సీ. స్వామియై నిగమాంతభూమియై సురపురో
గామియై యబ్ధిజాకామి యుండ
హారియై హాలహాలాధారియై భవపంక్తి
ధారియై ప్రసవాయుధారియుండ
వసుచరిత్రము. ఆశ్వా. 4. ప. 36.

సీ. ఏకమై పరమై విశోకమై సత్యమ
లోకమై వ్యాపకాలోక మగుచు
సారమై చిదచిదాకారమై యతినిర్వి
కారమై విగతసంసార మగుచు
సీతా. ఆశ్వా. 2. పద్య. 6.

ఉ. హా యను గాధినందనమఖారినిశాటమదాపహారి బా
హా యను గ్రావజీవదపదాంబురుహా యను రాజలోకసిం
హా యను బోషితార్యనివహా యనుఁ గానల కేఁగితే సిరీ
హా యను నిర్వహింపఁగలనా! నినుఁ బాసి రఘూద్వహా యనున్.
రామాభ్యుదయము. ఆశ్వా. 5. ప. 10.

ఉ. మాయను మిథ్యగాఁ దెలియుమా యనుఁ దత్కృతమెల్లఁగల్ల సు
మ్మా యను నేను నే ననకు మాయనుసాక్షిని నీవు జూచుకో
మ్మా యనుఁ జూడఁగా నితర మా యను నే నని నిశ్చయించుకో
మ్మాయనుఁగాక పోనితరమాయను మానముమానుమాయనున్.
సీతా. ఆశ్వా. 2. పద్య. 143.

సాధారణముగ శృంగారకావ్యములలో గోచరించి లయగ్రాహి రగడలు నిరోష్ఠ్యములు చతుఃప్రాసములు సర్వతఃప్రాసములు దుష్కటములగు వేదాంతమున నిముడ్చుటలో నిక్కవిని మించినవా రింకొక రుండరు.

సర్వథా గుణశోభితమగు నీయనకవిత్వము నెంత పొగడినను దనివితీరదు. ముద్రితగ్రంథమునఁ గొన్నియెడలఁ గవిభావమునకు భిన్నము లగుపాఠములు పద్యభాగములు గలవు. వ్రాతప్రతులు విశేషించి లభింపమిచే నీప్రమాదములు దొరలియుండును. కవికాలము గ్రహింప నిం దాధారములు లేవు. కాని సాధనాంతరములచే సాధింపఁ గొన్ని యవకాశములు గలవు. ప్రత్యక్షప్రమాణములు చిక్కువఱకు వానిని స్వీకరింపవచ్చును. సీతారామాంజనేయగ్రంథకర్తపుత్త్రుఁ డగు రామమూర్తి రతిమన్మథవిలాసము నెత్తి వ్రాసి యంత్యమున నిట్లు వ్రాసియున్నాఁడు. "ప్లవంగసంవత్సర జ్యేష్ఠ శు. ౧౩ గురువారమువఱకు పరశురామ పంతులరామన్నగారు రతిమన్మథవిలాసము పూర్వప్రతిలో నున్న క్రమాన వ్రాసిరి." ప్రతి జీర్ణతరముగ నుండుటవలనను ఈ రామమూర్తి క్రింద నుదాహరింపఁబోవు వంశవృక్షముప్రకారము 30 సంవత్సరములవయస్సు గల రాధాకృష్ణరావుగారికి ఆఱవ పురుషుఁ డగుటవలనను గాలనిర్ణయము సులభముగఁ జేయవచ్చును. తరమునకు ముప్పది సంవత్సరములచొప్పున లెక్కించినచో రామమూర్తికవి 180 సంవత్సరముల క్రింద నుండియుండును. ప్లవంగలు గ్రంథవయస్సుబట్టి నేఁటికి గడిచిన ట్లూహించినచో నీకాలము కొంచెము పైకిఁ బోయి ప్రతి 200 సంవత్సరముల క్రింద వ్రాసిన ట్లేర్పడును. ఇంతియగాక గ్రంథకర్త మునిమనుమఁ డగురామకృష్ణసోమయాజి 98 సంవత్సరములు జీవించి 30 సంవత్సరముల క్రిందఁ బరలోకగతులైన 98+30 = 128 సంవత్సరముల క్రింద జనించిన వ్యక్తికిఁ బైతరపు మూఁడవ పురుషుఁడు 90 యేండ్లపైఁగాలమున నుండె ననుకొన్నను రామమూర్తికాలము 180 సంవత్సరములుగానను లింగమూర్తికవి యిప్పటికి 220 సంవత్సరముల క్రింద గ్రంథరచనముగావించు ప్రౌఢవయస్సున నుండె ననుకొనవచ్చును. అనఁగా క్రీ. శ. 1710 ప్రాంతము గ్రంథరచనకాలము కావచ్చును. ఇది కవివంశజులతో సంప్రదించి నిర్ణయించిన కాలనిర్ణయము. ఇంతకు మించినయాధారము లింతవఱకు లభింపలేదు. లింగమూర్తికవి

రాజయోగానుభవము గడించి నిరంతరము శ్రీరామనామస్మరణానంద ముతోఁ గాలయాపనముఁ జేయుచు నంత్యకాలమున సన్న్యసించి మట్టె వాడలో సిద్ధినొందెను. ఈయనఁ బరుల యాచించి యెఱుంగనిధన్యుఁడు. ఈకవికిఁ దరువాతివంశచరిత్రము కొంత చెప్పుట ప్రకృతము కాకపోదు. కవియొద్దనుండి కడపటివంశవృక్షము.

(1) పరశురామపంతులలింగమూర్తి

|

(2) రామమూర్తి

|

(3) లింగమూర్తి

|

(4) రామకృష్ణయ్యసులు

|

(5) I సీతారామయ్య II అనంతరామయ్య III దశరథరామయ్య IV కోదండరామయ్య.

|

(6) పట్టాభిరామయ్య

|

(7) రాధకృష్ణరావు

వీరిలో 2-వ వాఁడగు రామమూర్తి మహాకవి. తండ్రివలన శ్రీరామమంత్రో పదేశము నొంది శ్రీరామానుగ్రహముఁబడసి రాజయోగధురంధరుఁడై మహాప్రతిష్ఠ గడించెను. ఈయనగ్రంథములలో నీక్రిందివి లభించినవి.

1. శ్రీరామహృదయము-ద్విపద
2. జీవన్ముక్తిప్రకరణము - పద్యములు
3. వివేకసారము
4. వేదాంతకీర్తనలు
5. ఈదులవాయరామశతకము
6. పరశురామశతకము
7. మనోహరశతకము

8. అధ్యాత్మరామాయణము - పద్యములు
9. శుకచరిత్రము
10. సీతారామాంజనేయము (గేయ ప్రబంధము.)

ఇందు శుకచరిత్రము సీతారామాంజనేయమంత్రగ్రంథము. అధ్యాత్మరామాయణము పోతనభాగవతములో సగము పరిమాణము గలది. మిగిలినవి చిన్నగ్రంథములు. తండ్రిరచించిన సీతారామాంజనేయమున కంతవఱకు వ్యాఖ్యలు లేకుండుటచేఁ గాఁబోలు దుర్గ్రాహ్యమని యీాయన గేయముగ రచించి వేదాంతవిద్యకరతలామలకము గావించెను. ఈవంశమున 4-వ తరము రామకృష్ణయనులవారు యజ్ఞాదులన్నింటిని గావించినధన్యుఁడు. పల్లకియొక్క పితృపితామహులనాఁటి నుండి పురశ్చరణమునందున్న శ్రీరామమంత్రము శిష్యసమూహమున కుపదేశించిన వ్యాపకపురుషుఁడు. 5-వ తరమునందలి సీతారామయ్య తర్కశాస్త్రవేత్త;అనంతరామయ్యజ్యోతిశ్శాస్త్రవిద్వాంసుఁడు. మొత్తము మీఁద నీతరములోని నలువురు పురుషులును కవులు పండితులు నైయున్నట్లు వీరివంశజులవలన జాగ్రత్తపఱుపఁబడిన లిఖితగ్రంథములవలనఁ దెలిసికొనవచ్చును. 6, 7 తరములలో నీగృహమున సంస్కృతవిద్య నశించి యాస్థానమున రాజకీయవిద్య నిలిచినది.

సీతారామాంజనేయము తొలుత వ్యాఖ్య స్వయముగ వ్రాసి క్రీ. శ. 1885 లో పాలపర్తి నాగేశ్వరశాస్త్రిగారు స్వకీయసుమనోమనోల్లాసిని ముద్రాశాలనుండి వెలువరించిరి. వీరి వ్యాఖ్య కొన్నియెడల సంక్షిప్తముగను మఱికొన్నియెడల వివరణరహితముగను నుండి సామాన్యులకు మూలభావము నెఱుంగరానివిషయముగ నుండెను. అందుచే సీతారామాంజనేయము కేవల విద్వజ్జనసాధ్యముగ నుండెను. ఆలోపము వారించి సీతారామాంజనేయము సర్వజనపఠనయోగ్యముగ విపులమగు వ్యాఖ్యానము విద్వద్వంశ్యులగు బ్రహ్మశ్రీ వెన్నెలకంటి సుందరరామశర్మగారిచే వ్రాయించి ముముక్షులగు ఆస్తికులకుఁ బ్రశంసాపాత్రులైన ఈనూతనప్రచురణ కర్తలగు బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగా

రెంతయుఁ బ్రశంసాపాత్రులు. కూలంకష మగు నాంధ్రవాఙ్మయ సేవా జీవితము గడపు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారిని సన్మానించుటలో నాంధ్రదేశ మింక వెనుకాడుచుంట సంతాపకరము.

కవితావిలాసము హనుమకొండ(నైజాము) 1—6—1934.

భాషాసేవకులు శేషాద్రిరమణకవులు, శతావధానులు. (ఆంధ్రపరిశోధక మహామండలి)

మ. పరమానందమయాత్ముఁ డెవ్వఁడు మనోనైచిత్రి నానాకృతుల్
పరఁగన్ విష్ణుభవాదినామముల సేవం బొందునయ్యాశుఁ డా
దర మొప్పన్ వెలయించు నిత్యమును సీతారామవాతాత్మ భూ
వరసంవాదసదాంధ్రటీక భువి నావార్యాభమినాకంబుగాన్.

మ. సరసామోదకరంబు నార్యజనధీసాకంబు లోకద్వయీ
నిరతానందవదాన్య మవ్విబుధవాణీకావ్య మద్దానికిన్
సరి యాంధ్రోక్తియు నీవ్యయంబును వెస న్నానాట క్షీణించ నా
దరశూన్యం బయి పెంపు లేక విగళత్తాళీదళాక్రాంతమై.

ఆ. దాని నుద్ధరింప దనవిత్తకాయసం
క్లేశములకుఁ గొంకి క్రిందుపడక
నుత్సుకతఁ గడంగె నొనర రామస్వామి
శాస్త్రి భువనహితము సల్పువేడ్క.

క. వావిళ్లవంశరత్నం
బావిద్వన్మణికిఁ దనయుఁ డార్యస్తుతుఁడౌ
నా వేంకటేశ్వరుఁడు ప్రా
ఖ్యావహుఁడై పూనె నంత నధికతరముగాన్.

తే. ఆఘనునిచోదనమున నే నల్పవేది
నయ్యు లోకోపకృతివాంఛ యతిశయిల్ల
వివృతిని బొనర్పఁ బూనితి విభునికరుణ
విబుధగుణలోల్యపోషణ వెలయుఁగాత!

---

శ్రీరస్తు

# విషయసూచిక

## తృతీయాశ్వాసము.

## నిఘంటువులు

| | | | |
|---|---|---|---|
| వావిళ్లనిఘంటువు (అ-ఔ వఱకు) 1-వ సంపుటము | ... | 10 | 0 |
| డిటో (క-ఞ వఱకు) 2-వ సంపుటము | ... | 12 | 0 |
| డిటో (ట-క్ష వఱకు) 3-వ సంపుటము | | అచ్చు | |
| శ్రీవేంకటేశాంధ్రము, పద్యకావ్యము | ... | 0 | 6 |
| బాలచంద్రోదయము | ... | 1 | 0 |
| మహాభాషామంజరి, (అరుభాషల ఒకేబ్యులరి) | ... | 2 | 8 |
| తెనుగుసామెతలు with English Translation by Captain Carr | ... | 2 | 0 |
| శబ్దార్థచంద్రిక, శ్రీమహాకాళి సుబ్బారాయకృత ఆంధ్రనిఘంటువు | | 10 | 0 |
| Sankaranarayana's English Telugu Dictionary, శంకరనారాయణగారినిఘంటువు (ఇంగ్లీషుపదములకు తెనుగు అర్థముగలది) | ... | 15 | 0 |
| " (తెనుగుపదములకు ఇంగ్లీషు అర్థముగలది) | | 12 | 0 |
| English-TeluguPocket Dictionary ఇంగ్లీషు-తెనుగు పాకెట్టు డిక్షనరి | ... | 5 | 0 |
| Translation Guide[English to Telugu & Vice Versa] | | 2 | 8 |
| సంస్కృతాంధ్రనిఘంటువు | ... | 5 | 0 |
| త్రికాండశేషము, సటీక | ... | 1 | 12 |
| విశ్వకోశము, (విశ్వనిఘంటువు) సటీక | ... | 2 | 8 |
| మేదినీకోశము " | ... | 4 | 0 |
| హారావళి, ఏకాక్షరీకోశము " | ... | 1 | 0 |
| అమరము, ప్రథమకాండము మూలము పెద్దచ్చు | ... | 0 | 4 |
| " " టీక | ... | 0 | 10 |
| ఆంధ్రనామసంగ్రహము, మూలము | ... | 0 | 3 |
| " టీకతో | ... | 0 | 10 |
| అమరము 3 కాండలు, మూలము | ... | 1 | 0 |
| ధనంజయనిఘంటువు | ... | 1 | 4 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
పోస్టుబాక్సు 1372, మద్రాసు. 1.

శ్రీహయగ్రీవాయ నమః

# శ్రీసీతారామాంజనేయసంవాదము

## టీకాతాత్పర్యవిశేషార్థము

---

## పీఠిక

### ఇష్టదేవతాస్తోత్రము

అవతారిక. పరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తి యను గ్రంథకర్త శిష్టులయాచారము ననుసరించి మంగళము నాచరించుచు గ్రంథార్థమును గూడ సూచించుచున్నాఁడు —

శా. శ్రీమద్దివ్యనిజాంఘ్రిపద్మములు సంసేవించుచున్ భక్తిచే
ధీమంతుం డగునాంజనేయుని నసద్దేహేంద్రియాతీతచి
ద్ధామానందుఁడ వీవ నే నని కృప న్బోధించు శ్రీజానకీ
రామబ్రహ్మము నంతరంగమున నారాధింతు నశ్రాంతమున్. 1

### వ్యాఖ్యాతృకృతస్తుతి

శా. శ్రీలోకేశుఁ డెవండు సర్వమునఁ దాఁ జెల్వొందియున్ సర్వమున్
ఆలోకించుట నన్యుఁ డయ్యుచు సమస్తాధారతన్ సర్వమై
లీలన్ వెల్గు విచారదృష్టి ననయన్ లే దన్య మెవ్వానికిన్
జాలం గొల్చెద నయ్యనాదినిధను న్సచ్చిత్ప్రమోదాత్మునిన్.

ఉ. సుందరమాంబకున్ ప్రథితసువ్రతకున్ పరదేశమంత్రికిన్
నందనుఁడన్ రమేశకరుణాపరిలబ్ధకవిత్వశక్తిని
స్పందుఁడ రామదాసబుధపౌత్రుఁడ వెన్నెలకంటివంశ్యుఁడన్
సుందరరామనామకుఁడ సూరిజనైకవిధేయచిత్తుఁడన్.

తే. శంకరాచార్యపదముల సాఁగి మ్రొక్కి
యస్మదీయగురుశ్రేణి నభినుతించి
యొసఁగ వివరింతు శ్రీరామహృదయ మేను
ఘనులకరుణచె విన్నంత గనినయంత.

చ. అనిశము పాముఁ జేరి విషమై చెడు పాలును బోలె సద్గుణం
బును గుణహీనుఁ జేరి చెడుఁ బొల్పుగఁ దోయపుబిందువైన శు
క్తినిఁ బడి ముత్యమైనగతిఁ గిల్బిషహీనునిఁ జేరి దోషమై
నను మహనీయమై తగుఁ గనన్ జగతీస్థలి నిట్టితత్త్వమున్.

క. కని నిశ్చయించి సాహసమును బూనితి నప్రబుద్ధముగ్ధాత్ముఁడ న
య్యును నిని యార్యుల యాదృతిఁ గని వర్ధిలు నాపయోధిగ గనార్కముగాన్.

టీక. శ్రీమ...ములు-శ్రీమత్ = శోభాయుక్తములైన, దివ్య = శ్రేష్ఠములైన (లేక, లోకాతీతములైన,) నిజ = తన, అంఘ్రిపద్మములు = పాదకమలములను (ఇచ్చట ద్వితీయార్థమునందు ప్రథమ), భక్తిచేన్ = అపరోక్షజ్ఞానమునకు సాధన మగు అనన్యభక్తిచే [బాహ్యభక్తి, అనన్యభక్తి, ఏకాంతభక్తి అని భక్తి మూఁడు విధములు. అందు బాహ్యభక్తి పరోక్షజ్ఞానమును (అనఁగా: తనకంటె నధికుఁ డగుపరమేశ్వరుఁడు ఒకడున్నాఁ డనుజ్ఞానమును) కలిగించును. అనన్యభక్తి అపరోక్షజ్ఞానమును (అనఁగా: తనకును ఈశ్వరునకును భేదము లే దనుజ్ఞానమును) కలుగఁజేయును. ఏకాంతభక్తి పరమానందానుభవమును గలిగించును], సంసేవించుచున్, ధీమంతుండు=వివేకముగలవాఁడు (పరబ్రహ్మము నిత్యమనియు ప్రపంచ మనిత్యమనియు జ్ఞానము గలవాఁడు), అగునాంజనేయునిన్ = ఐనహనుమంతుని, అస...డవు-అసత్ = లేని (అసత్యములైన), దేహ= (స్థూలము సూక్ష్మము కారణము మహాకారణము అను) దేహములను, ఇంద్రియ = ఇంద్రియములను, అతీత=అతిక్రమించిన (దేహేంద్రియాదులకంటె వేఱైన), సత్ = సత్యస్వరూపుఁడవును, చిత్ = జ్ఞానస్వరూపుఁడవును, భూమానందుఁడవు = పరమానందస్వరూపుఁడవును అగు, ఈవ=నీవే, నేను (జీవుఁడే బ్రహ్మమనుట), అని, కృపన్ = పరమానుగ్రహముచే, బోధించు = తెలిసికొనునట్లుచేయు, శ్రీ...బ్రహ్మమున్-శ్రీ=అష్టైశ్వర్యయుక్తమగు, జానకీరామబ్రహ్మమున్ = సీతాసహితరామబ్రహ్మమును (ఇచ్చట సీతను మాయఁగాను, రాముని పరబ్రహ్మముఁగాను జెప్పియున్నాఁడు), అంతరంగమునన్=మనసునందు, అశ్రాంతమున్=సర్వకాలములయందును, ఆరాధింతున్ = సేవింతును (ధ్యానింతు ననుట).

తాత్పర్యము. అనన్యభక్తిచేఁ దనపాదముల నెప్పుడును సేవించుచుఁ దత్ప్రభావమువలన దృఢమగు వివేకవైరాగ్యములు గలిగి యుత్తమాధికారియై యున్న హనుమంతునకు "తత్త్వమసి" = "ఆబ్రహ్మమే నీవు" అను మహావాక్యముయొక్క యర్థమును గరుణవెలయ నుపదేశించు నాసీతారామబ్రహ్మమును సర్వకాలములయందును ధ్యానించెదను.

అవ. ఇట్లు తన యిష్టదైవమగు శ్రీరాముని పరబ్రహ్మరూపునిఁగా వర్ణించి యీ పద్యమున సీతాదేవిని మూలప్రకృతిరూపముతో నభివర్ణించుచున్నాఁడు.—

సీ. తనరజోగుణముచేఁ దనరంగ నేదేవి
కల్పించు నఖిలలోకముల నెల్లఁ
దనసత్త్వగుణముచే నొసరంగ నేకొమ్మ
పోషించు నీసర్వభూతములను
దనతమోగుణముచేఁ దగ నేవధూమణి
జగముల నెల్ల సంక్షయముఁ జేయుఁ
దాశుద్ధసత్త్వప్రధానయై యేరామ
రామాంకమున నజస్రము వసించు

తే. నట్టిభువనైకమాత దయాసమేత, సద్గుణవ్రాత నిర్మలస్వాంతపూత
భక్తజనమానసోద్యానపారిజాత, సీత కరుణించి నన్నురక్షించుఁగాత.

టీ. ఏదేవి = మూలప్రకృతియగు నేసీతాదేవి, తనరజోగుణముచేన్ = తనకుఁగల రజోగుణముచేత, తనరంగన్ = ఒప్పునట్లుగా, అఖిలలోకముల నెల్లన్ = నానావిధములగు భేదములుగల యీబ్రహ్మాండముల నెల్లను, కల్పించున్ = సృష్టించునో (ఇచ్చట కల్పించు ననుటచే వాస్తవముగ నీప్రపంచము బ్రహ్మమునకంటె వేఱు కాకున్నను వేఱుగానున్నట్లు తోఁపఁజేయుచున్నది యని భావము.); ఏకొమ్మ = ఏస్త్రీ, తనసత్త్వగుణముచేన్ = తనకుగల సత్త్వగుణముచేత (శుద్ధసత్త్వమనియు, మలినసత్త్వమనియు సత్త్వగుణము రెండువిధములు: అందు రజస్తమోగుణములతోఁ గొంచెమైనను సంబంధపడనిది శుద్ధసత్త్వము; అట్లుకానిది మలినసత్త్వము. ప్రకృతమున ఆమలినసత్త్వమును గూర్చియే చెప్పఁబడియున్నది యని తెలిసికొనవలయును.), ఒసరంగన్ = ఒప్పునట్లుగా, ఈసర్వభూతములను, పోషించున్, ఏవధూమణి=ఏనారీరత్నము, తనతమోగుణముచేన్ = తనకుఁగల తమోగుణముచేత, తగన్ = ఒప్పునట్లుగా, జగముల నెల్లన్ = లోకముల నంతయు, సంక్షయమున్ చేయున్ = నశింపఁజేయునో, ఏరామ=ఏయువతి, తాన్ = తాను, శుద్ధసత్త్వప్రధాన+ఐ = శుద్ధసత్త్వమే ప్రధానముగాఁ గలదియై (శుద్ధసత్త్వస్వరూపిణి యై యనుట.), రామాంకమునన్ = పరబ్రహ్మస్వరూపుఁడగు శ్రీరామునితొడపై, అజస్రమున్ = సర్వకాలములయందును, వసించున్ = నివసించునో (మాయాశక్తి పరబ్రహ్మమునకు నిత్యానపాయిని. అనఁగా: అగ్నియందున్న యుష్ణశక్తియునుం బోలె నెప్పుడును పరబ్రహ్మమును విడువకుండునది యని భావము.) అట్టిభువనైకమాత = ఆ లోకజననియు, దయాసమేత = దయగలదియు, సద్గుణవ్రాత = శ్రేష్ఠము లగుగుణసమూ

హములు గలదియు, నిర్మలస్వాంత = పవిత్ర మగుహృదయము గలదియు, పూత=నిర్వి కారస్వరూపము గలదియు (బ్రహ్మము మాయయు నొక్కటియే కావున నిట్లు చెప్ప బడెను.) భక్త... పారిజాత-భక్తజన = భక్తజనులయొక్క, మానస = మనస్సులనియెడు ఉద్యాన = ఉద్యానవనమునందు, పారిజాత = పారిజాతవృక్షమువంటిదియు (తనను ధ్యానించినవారికి కోరినకోర్కుల నొసంగునది యనుట), అగు, సీత, నన్నున్, కరుణించి = దయఁజూచి, రక్షించుక్ కాతక్ = రక్షించునుగాక! (ఆపదలనుండి తొలఁ గించును గాక.)

తా. గుణసామ్యము (సత్త్వరజస్తమోగుణములు ఎక్కువతక్కువలు లేక సమానములుగా నుండుట.) స్వరూపముగాఁ గలది యగుటచేఁ సత్త్వరజస్తమో గుణములమూలమున సృష్టిస్థితిసంహారములను జేయుచు శుద్ధసత్త్వస్వరూపములోఁ బరబ్రహ్మమునందు భేదముగా నిలిచియుండు నాలోకజనని మూలప్రకృతి (మూల ప్రకృతి యగు సీతాదేవి) కోరినకోర్కుల నొసంగి నన్ను రక్షించుఁ గాక (ఓంకా రమునందు అకార ఉకార మకారము లను మూఁడువర్ణములు కలవు. ఇవి మూఁడును క్రమముగ సత్త్వరజస్తమోగుణము లనియు, మకారము పైనున్న యర్ధమాత్ర గుణ సామ్యస్థితి యనియు, ఇవియన్నియుఁ గలిసి యేర్పడిన "ఓమ్" అను అక్షరము ప్రకృతి యనియు, ఆ యక్షరముయొక్క యర్థము పరబ్రహ్మమనియు నుపాసింపవలయు నని చెప్పఁబడి యున్నది. దీనిచేఁ బ్రకృతికిని బ్రహ్మమునకును గలసంబంధమును బాఠకు లూహింతురు గాక.)

అవ. ఇట్లు ప్రకృతిపురుషుల వినుతించి, బ్రహ్మ విష్ణు రుద్రు లను పేళ్లతో సత్త్వరజస్తమోగుణములు ఉపాధులు (ఆవరణములు)గాఁ గలిగి విలసిల్లుపరమాత్మ ప్రతి బింబముల వినుతించుచున్నాఁడు.—

సీ. తతశుద్ధసత్త్వప్రధానవిగ్రహుల నిమ్ముల రజస్స్వీతమోగుణాకుల
స్వసుధర్మ శృంగార వైరాగ్యవేషుల విశ్వోద్భవస్థితివిలయకరులఁ
దప్తకాంచన నీరధర చంద్రవర్ణుల శుభకమండలుచక్రశూలధరుల
ఘనసత్య వైకుంఠ కైలాసవాసుల వరహంసఖగవృషవాహనులను

తే. షడ్గుణైశ్వర్యయుతుల భాషావధూప్ర
సన్నమంగళ దేవతాసర్వమంగ
ళాధిపతుల సాక్షాత్పరమాత్మమయుల
బ్రహ్మవిష్ణుమహేశులఁ బ్రస్తుతింతు. 3

టీ. తత...విగ్రహులన్ - తత = వ్యాపించిన, లేక, ప్రసిద్ధ మైన, శుద్ధసత్త్వ ప్రధాన = శుద్ధసత్త్వరూప మగుమాయయే, లేక, త్రిగుణములును లయము నొందు స్థానమైనచిత్ప్రకృతియే, విగ్రహులన్ = శరీరములుగాఁ గలిగినట్టియును (మాయామయము లగుశరీరములు గలవారు, లేక, సర్వమునకు నధిష్ఠాన మైనప్రకృతితో నభిన్నులై యుండువారు అని భావము.) రజస్సత్త్వతమోగుణకులన్ = రజోగుణము సత్త్వగుణము తమోగుణము (ఈగుణములకు కార్యము లగుఘోరవృత్తి, శాంతవృత్తి, మూఢవృత్తి) కలిగినట్టియును (ఆవృత్తులవలన ప్రపంచమునకు సృష్టిస్థితిసంహారములు జరుగు నని భావము) స్వ...వేషులన్ - స్వ = స్వకీయ మైన, సుధర్మ = శ్రేష్ఠ మగుధర్మము (వర్ణధర్మములు, ఆశ్రమధర్మములు మొదలగునవి.), శృంగార = వస్త్రభూషణాద్యలంకారములు, లేక శృంగారరసము, వైరాగ్య = విరక్తి, ఇవియే, వేషులన్ = వేషములుగాఁ గలిగినట్టియు (బ్రహ్మ ధర్మపరుఁడనియు, విష్ణువు శృంగారపరుఁడనియు, ఈశ్వరుఁడు వైరాగ్యపరుఁ డనియు భావము.), విశ్వ...కరులన్ - విశ్వ = ప్రపంచముయొక్క, ఉత్పాద = సృష్టిని, స్థితి = రక్షణమును, విలయకరులన్ = ప్రళయమును ఆచరించునట్టియు, తప్త...వర్ణులన్ - తప్త = పుటము వేయఁబడిన, కాంచన = సువర్ణముయొక్కయు (కాంతియొక్క యాధిక్యమును జెప్పుటకై యిచ్చట "తప్త" అనువిశేషణము వేయఁబడినది ), నీరధర = మేఘము యొక్కయు (నీటితోఁ గూడియున్న మేఘము మిగులఁ గాంతి గలదై యుండును గావున నిట "నీర" పదము ప్రయోగింపఁబడినది.), చంద్ర = చంద్రునియొక్కయు, వర్ణులన్ = వర్ణమువంటి వర్ణముగలిగినట్టియు (ఇవి క్రమముగా రజస్తమస్సత్త్వగుణముల వర్ణములు కావున త్రిమూర్తులకును ఇవి బాహ్యస్వభావములని తెలిసికొనవలయును. బ్రహ్మకు లోపలను వెలుపలను గూడ రజోగుణమే; విష్ణువునకు లోపల సత్త్వము, వెలుపల తమస్సు; రుద్రునకు లోపలఁ దమస్సు, వెలుపల సత్త్వము ఆవరణము లని యెఱుంగు నది.), శుభకమండలు చక్ర శూలధరులన్ = శుభకరము లగు కమండలువు చక్రము శూలము ధరించినట్టియు, ఘనసత్యవైకుంఠ కైలాసవాసులన్ = శ్రేష్ఠములగు సత్యలోక వైకుంఠ కైలాసములయందు నివసించువారును, వరహంసఖగవృషవాహనులన్ = శ్రేష్ఠ ములగు హంస గరుడ నందికేశ్వరులు వాహనములుగాఁ గలిగి నట్టియు, షడ్గుణైశ్వర్య యుతులన్ = షడ్గుణముల సమృద్ధి గలిగినట్టియుఁ (అధికమగుప్రభావము, ధైర్యము, కీర్తి, సంపద, జ్ఞానము, వైరాగ్యము, అనునివి షడ్గుణములు), భాషా...పతులన్ - భాషావధూ = సరస్వతీదేవికిని, ప్రసన్నమంగళదేవతా = ప్రసన్నురాలగు, లేక, దయయే స్వభావముగాఁగల లక్ష్మీదేవికిని, సర్వమంగళా = పార్వతీదేవికిని, అధిపతులన్ = ప్రభువు లయినట్టియు (గుణత్రయశక్తులను స్వాధీనముగాఁ జేసికొనియుండుభా

హములు గలదియు, నిర్మలస్వాంత = పవిత్ర మగుహృదయము గలదియు, పూత=నిర్వి కారస్వరూపము గలదియు (బ్రహ్మము మాయయు నొక్కటియే కావున నిట్లు చెప్పఁబడెను.) భక్త... పారిజాత-భక్తజన = భక్తజనులయొక్క, మానస = మనస్సులనియెడు, ఉద్యాన = ఉద్యానవనమునందు, పారిజాత = పారిజాతవృక్షమువంటిదియు (తనను ధ్యానించినవారికి కోరినకోర్కుల నొసంగునది యనుట), అగు, సీత, నన్నున్, కరుణించి = దయఁజూచి, రక్షించుఁగాతన్ = రక్షించునుగాక! (ఆపదలనుండి తొలఁగించును గాక.)

తా. గుణసామ్యము (సత్త్వరజస్తమోగుణములు ఎక్కువతక్కువలు లేక సమానములుగా నుండుట.) స్వరూపముగాఁ గలది యగుటచే [illegible] సత్త్వరజస్తమో గుణముల మూలమున సృష్టిస్థితిసంహారములను జేయుచు శుద్ధసత్త్వస్వరూపమునొందు పరబ్రహ్మమునందు భేదముగా నిలిచియుండు నా[illegible]కజనని మూలప్రకృతి (మూల ప్రకృతి యగు సీతాదేవి) కోరినకోర్కుల నొసంగి నన్ను రక్షించుఁ గాక (ఓంకారమునందు అకార ఉకార మకారము లను మూఁడువర్ణములు కలవు. ఇవి మూఁడును క్రమముగ సత్త్వరజస్తమోగుణము లనియు, మకారము పైనున్న యర్ధమాత్ర గుణసామ్యస్థితి యనియు, ఇవియన్నియుఁ గలిసి యేర్పడిన "ఓమ్" అను అక్షరము ప్రకృతి యనియు, ఆ యక్షరముయొక్క యర్థము పరబ్రహ్మమనియు నుపాసింపవలయు నని చెప్పఁబడి యున్నది. దీనిచేఁ బ్రకృతికిని బ్రహ్మమునకును గలసంబంధమును బాఠకు లూహింతురు గాక.)

అవ. ఇట్లు ప్రకృతిపురుషుల వినుతించి, బ్రహ్మ విష్ణు రుద్రు లను పేళ్లతో సత్త్వరజస్తమోగుణములు ఉపాధులు (ఆవరణములు)గాఁ గలిగి విలసిల్లుపరమాత్మ ప్రతిబింబముల వినుతించుచున్నాఁడు.—

సీ. తతశుద్ధసత్త్వప్రధానవిగ్రహుల నిమ్ముల రజస్సత్త్వతమోగుణకుల
స్వసుధర్మ శృంగార వైరాగ్యవేషుల విశ్వోద్భవస్థితివిలయకరులఁ
దప్తకాంచన నీరధర చంద్రవర్ణుల శుభకమండలుచక్రశూలధరుల
ఘనసత్య వైకుంఠ కైలాసవాసుల వరహంసఖగవృషవాహనులను

తే. షడ్గుణైశ్వర్యయుతుల భాషావధూప్ర
సన్నమంగళదేవతాసర్వమంగ
ళాధిపతుల సాక్షాత్పరమాత్మమయుల
బ్రహ్మవిష్ణుమహేశులఁ బ్రస్తుతింతు.

టీ. తత...విగ్రహులన్ - తత = వ్యాపించిన, లేక, ప్రసిద్ధ మైన, శుద్ధసత్త్వప్రధాన = శుద్ధసత్త్వరూప మగుమాయయే, లేక, త్రిగుణములును లయము నొందు స్థానమైనచిత్ప్రకృతియే, విగ్రహులన్ = శరీరములుగాఁ గలిగినట్టియును (మాయామయము లగుశరీరములు గలవారు, లేక, సర్వమునకు నధిష్ఠాన మైనప్రకృతితో నభిన్నులై యుండువారు అని భావము.) రజస్సత్త్వతమోగుణకులన్ = రజోగుణము సత్త్వగుణము తమోగుణము (ఈగుణములకు కార్యము లగుఘోరవృత్తి, శాంతవృత్తి, మూఢవృత్తి) కలిగినట్టియును (అప్పటప్పటలకు ... క్రమముగ సృష్టిస్థితిసంహారములు జరుగు నని భావము) స్వ...వేషులన్ - స్వ = స్వకీయము లైన, సుధర్మ = శ్రేష్ఠ మగుధర్మమును (వర్ణధర్మములు, ఆశ్రమధర్మములు మొదలగునవి.), శృంగార = వస్త్రభూషణాద్యలంకారములు, లేక శృంగారరసము, వైరాగ్య = విరక్తి, ఇవియు, వేషులన్ = వేషములుగాఁ గలిగినట్టియును (బ్రహ్మ ధర్మపరుఁడనియు, విష్ణువు శృంగారపరుఁడనియు, ఈశ్వరుఁడు వైరాగ్యపరుఁడనియు భావము.), విశ్వ...కరులన్ - విశ్వ = ప్రపంచముయొక్క, ఉద్భవ = సృష్టిని, స్థితి = రక్షణమును, విలయకరులన్ = ప్రళయమును ఆచరించునట్టియును, తప్త...వర్ణులన్ - తప్త = పుటము వేయఁబడిన, కాంచన = సువర్ణముయొక్కయు (కాంతియొక్క యాధిక్యమును జెప్పుటకై ఇచ్చట "తప్త" అనువిశేషణము వేయఁబడినది), నీరధర = మేఘముయొక్కయు (నీటితోఁ గూడియున్న మేఘము మిగులఁ గాంతి గలదై యుండును గావున నిట "నీర" పదము ప్రయోగింపఁబడినది.), చంద్ర = చంద్రునియొక్కయు, వర్ణులన్ = వర్ణమువంటి వర్ణముగలిగినట్టియును (ఇవి క్రమముగా రజస్తమస్సత్త్వగుణముల వర్ణములు కావున త్రిమూర్తులకును ఇవి బాహ్యోపాధులని తెలిసికొనవలయును. బ్రహ్మకు లోపలను వెలుపలను గూడ రజోగుణమే; విష్ణువునకు లోపల సత్త్వము, వెలుపల తమస్సు; రుద్రునకు లోపలఁ దమస్సు, వెలుపల సత్త్వము అపరణము లని యెఱుంగునది.), శుభకమండలు చక్ర శూలధరులన్ = శుభకరము లగు కమండలువు చక్రము శూలము ధరించినట్టియు, ఘనసత్యవైకుంఠ కైలాసవాసులన్ = శ్రేష్ఠములగు సత్యలోక వైకుంఠ కైలాసములయందు నివసించువారును, పరహంసఖగవృషవాహనులను = శ్రేష్ఠములగు హంస గరుడ నందికేశ్వరులు వాహనములుగాఁ గలిగి నట్టియు, షడ్గుణైశ్వర్యయుతులన్ = షడ్గుణముల సమృద్ధి గలిగినట్టియుఁ (అధికమగుప్రభావము, ధైర్యము, కీర్తి, సంపద, జ్ఞానము, వైరాగ్యము, అనునివి షడ్గుణములు), భాషా...పతులన్ - భాషావధూ = సరస్వతీదేవికిని, ప్రసన్నమంగళదేవతా = ప్రసన్నురాలగు, లేక, దయయే స్వభావముగాఁగల లక్ష్మీదేవికిని, సర్వమంగళా = పార్వతీదేవికిని, అధిపతులన్ = ప్రభువు లయినట్టియు (గుణత్రయశక్తులను స్వాధీనముగాఁ జేసికొనియుండువా

రనుట), సాక్షాత్...మయులన్ - సాక్షాత్ = ప్రత్యక్షమైన, పరమాత్మమయులన్ = నిర్వికారపరబ్రహ్మమే స్వరూపముగాఁ గలిగినట్టియు ('పరమాత్మవిభాగస్థాః' అను శాస్త్రమును అనుసరించి యీ బ్రహ్మ విష్ణు మహేశ్వరులు పరమాత్మరూపులే. సృష్ట్యాదియందు గుణములు మూఁడును విజృంభింప నారంభించినపుడు వానిలోఁ ప్రతిబింబించి సర్వవ్యాపకమగు నాపరబ్రహ్మము మూఁడువిధములుగాఁ జెప్పఁబడు చున్నది. అని తెలిసికొనవలయును.), బ్రహ్మవిష్ణుమహేశులన్, ఇమ్ములన్ = అధికముగా, ప్రస్తుతింతున్ = స్తోత్రముచేయుచున్నాను.

తా. సత్త్వరజస్తమోగుణములు లయము నొందుటను (ఉత్పత్తిస్థితిలయములం జెందుటకు అని కూడ గ్రహింపవలయును. వస్తువైనను తా నుత్పత్తిఁ జెందిన స్థలము నందె, అనఁగా ఉపాదానకారణమునందె, లయమునొందును గదా!), స్థానమగు చిత్ప్రకృతియే, లేక, మాయయే, దేహములుగాఁ గలిగి రజస్సత్త్వతమోగుణవృత్తుల నాశ్రయించుచు వర్ణాశ్రమధర్మములు, శృంగారము, వైరాగ్యము అనునవియే వేష ములుగాఁ గలిగి నామరూపాత్మక మగుసకలప్రపంచమును (ఈ ప్రపంచమునందు పేర్లును రూపములును దప్పఁ బరబ్రహ్మమునకంటె నన్యమగుపదార్థ మేదియును లేదు.) పుట్టించుచు రక్షించుచు సంహరించుచు, ఎఱుపు నలుపు తెలుపు అనుశరీరచ్ఛాయ గలిగి, కమండలు చక్ర శూలముల ధరించుచు, సత్యలోక వైకుంఠ కైలాసములయందు విలసిల్లువారును, హంసగరుడవృషభ వాహనులును, ప్రభావము ధైర్యము మొదలగు షడ్గుణములచే నొప్పువారును, సరస్వతీ లక్ష్మీ పార్వతీనాయకులును, పరబ్రహ్మరూపు లును అగు బ్రహ్మవిష్ణుమహేశ్వరుల నుతించెదను.

అవ. ఇట్లు బ్రహ్మవిష్ణుమహేశ్వరుల నుతించి, వారలయిండ్లనుండి వారికి సృష్ట్యాదికార్యములు చేయఁగల సామర్థ్యముల నిచ్చు త్రిగుణశక్తులఁ బ్రార్థించు చున్నాఁడు —

శా. బ్రహ్మాండంబు సృజింపఁ బెంప నడఁయింపం జాలుసామర్థ్యముల్
బ్రహ్మోపేంద్రనగేంద్రచాపులకు సంపాదించుచు న్వారికిన్
బ్రహ్మాత్మైక్యవివేక మిచ్చుచును సంభావించుచుం బ్రోచునా
బ్రాహ్మీ మంగళదేవతాగిరిజలం బ్రార్థింతు నశ్రాంతమున్. 4

టీ. బ్రహ్మాండంబున్ = ప్రపంచమును, సృజింపన్ = సృష్టిచేయుటకును, పెంపన్ = వృద్ధిఁ జెందించుటకును, నడఁయింపన్ = నశింపఁజేయుటకును, చాలు...ముల్ - చాలు = తగిన, సామర్థ్యముల్ = శక్తులను, బ్రహ్మ...చాపులకున్ - బ్రహ్మ = చతుర్ముఖున కును, ఉపేంద్ర = విష్ణువునకును, నగేంద్రచాపులకున్ = శివునకును (త్రిపురసంహార

మున రుద్రుఁడు మేరుపర్వతమును ధనుస్సుగా ధరించె నని పురాణగాథ కలదు. దానింబట్టి, నగేంద్రచాపుఁడు=పర్వతము ధనుస్సుగాఁ గలవాఁడు, అనుపదము ప్రయోగింపఁబడెను.), సంపాదించుచుక్ = కలుఁగఁజేయుచు (ఈత్రిమూర్తులు నిర్వికారులే కావున వీరలకు సృష్ట్యాదికార్యములు చేయఁసామర్థ్యము స్వయముగా లేదు. వీరి సాన్నిధ్యమువలన త్రిగుణశక్తులే యీ కార్యములను జేయును. అవి శక్తియుక్తులగు నీ త్రిమూర్తులయం దారోపింపఁబడును. అని తెలిసికొనవలయును.), వారికిక్=ఆత్రిమూర్తులకు, బ్రహ్మైక్యవివేకముక్ = నిర్గుణపరబ్రహ్మజ్ఞానమును (తాము నొక్కటియే అనుజ్ఞానమును), ఇచ్చుచును సంభావించుచుక్ = ఇచ్చి గౌరవించుచు (అవిద్యజీవులను స్వాధీనముగాఁ వారిని లోఁబఱుచుకొని వారికి బంధములు గలిగించును. ఈగుణశక్తులట్లుగాక బ్రహ్మవిష్ణుమహేశ్వరులకు లోఁబడి వారలకు బంధమును గలిగింపకున్నవి యనియు, అట్లగుటచే వారలకు బ్రహ్మైక్యజ్ఞానమును దృఢముగా నున్నదనియు భావము.), బ్రోచునాబ్రాహ్మీమంగళదేవతాగిరిజలక్ = రక్షించునట్టి యీ సరస్వతీలక్ష్మీపార్వతులను (ఇచ్చట రక్షించుటకు నన్నుగా బంధము గలుగఁజేయకుండుటయే యని తెలిసికొనవలయును.), అశ్రాంతముక్ = ఎల్లప్పుడును, ప్రార్థింతున్.

తా. చతుర్ముఖునకు సృష్టిజేయుటయందును, విష్ణువునకు రక్షించుటయందును, రుద్రునకు సంహరించుటయందును సామర్థ్యమును గలుగఁజేయుచు, తమవికారములచే బంధమును గలిగింపక వారికి "అహం బ్రహ్మాస్మి"="నేనే బ్రహ్మయును" అనుజ్ఞానమును దృఢముచేయుచు నుండు త్రిగుణశక్తులగు వాణీలక్ష్మీపార్వతుల ధ్యానించెదను.

అవ. గణేశుని పరబ్రహ్మరూపునిగా స్తోత్రముఁ జేయుచున్నాఁడు:—

క. పరవిశ్వోద్గతిహేతువు
పరముఁడు పురుషుండు ప్రకృతి బ్రహ్మము పరమే
శ్వరుఁ డంచుఁ దజ్ఞు లెవ్వనిఁ
బరికింపుదు రగ్గణాధిపతి నర్చింతున్. 5

టీ. ఎవ్వనిక్=ఏమహాత్ముని, పరవిశ్వోద్గతిహేతువు = ప్రపంచోత్పత్తికిఁ గారణభూతుఁడు (ఉత్పత్తిస్థితిలయములకుఁ గారణ మనుట.), పరముఁడు = ప్రకృతికిని పురుషునకును అధికుఁడగువాఁడు, పురుషుఁడు=జీవస్వరూపుఁడు, ప్రకృతి = ఉపాదానకారణభూతుఁడు ("పరవిశ్వోద్గతి" అనుటచే నిమిత్తకారణభూతుఁ డనుటనుగూర్చి చెప్పఁబడెనని తెలియునది. లేక, మాయారూపుఁడును; పరబ్రహ్మమునకును, మాయకును భేదములేదు గావున నిట్లు చెప్పఁబడెను.), బ్రహ్మము=చతుర్ముఖుఁడు, పరమేశ్వరుఁడు = రుద్రుఁడు, అంచుక్=అని, తజ్జ్ఞులు=తత్త్వవేత్తలు, పరికింపుదురు = విచారింతురో, లేక, ధ్యానిం

తురో (చిత్తశుద్ధికొఱకై యాయారూపములతో ధ్యానింతురో, యనుట.), గణాధిపతిన్ = అవిఘ్నేశ్వరుని, అర్చింతున్ = పూజించెదను.

తా. ఈప్రపంచమునకు నిమిత్తకారణముగాను, ఉపాదానకారణముగాను ఉన్న ప్రకృతిపురుషాత్మకమగు పరబ్రహ్మమనియు, జీవరూపుఁడనియు, బ్రహ్మరుద్రాదిస్వరూపములతో నున్నాఁడనియు తత్త్వజ్ఞానము గలవారిచే సర్వకాలములయందును ధ్యానింపఁబడుచున్న (లేక, అధికారభేదములచే ననేకవిధములుగా సేవింపఁబడుచున్న) యావిఘ్నేశ్వరుని బూజించుచున్నాను.

అవ. ఇట్లు దేవతల బ్రార్థించి, దేవతల నుపాసించుచున్నను తత్త్వజ్ఞానమునకై గురు నుపాసించుట చిత్తశుద్ధికర మని ధ్యానించుచున్నాఁడు:—

మ. తనరం గాయముచేత రామచరణద్వంద్వైకదాస్యంబు నా
చ్చినభక్తిం దగువాక్కుచే ననిశమున్ శ్రీరామనామప్రకీ
ర్తనముం జిత్తముచేత రామపరతత్త్వధ్యానముం జేయు శ్రీ
హనుమంతున్ సముపాశ్రయింతు మదభీష్టార్థంబు సిద్ధింపఁగన్. 6

టీ. తనరన్ = ఒప్పునట్లుగా, కాయముచేతన్ = శరీరముచే, రామ... దాస్యంబున్ = రామ = శ్రీరామునియొక్క, చరణద్వంద్వ = పాదయుగ్మముయొక్క, దాస్యంబున్ = సేవను, తగువాక్కుచేన్ = యుక్తమైన (వేదాధ్యయనము, సత్యభాషణము మొదలగు వాఙ్మయతపస్సులతో గూడిన దగుటచే నిర్మలమైన) వాక్కుచేత, అనిశమున్ = ఎల్లప్పుడును, శ్రీరామ...కీర్తనమున్ - శ్రీరామ = శ్రీరామునియొక్క, నామ = నామధేయము యొక్క, ప్రకీర్తనమున్ = జపమును, చిత్తముచేతన్ = మనస్సుచేత, రామ... ధ్యానమున్ - రామ = ఆశ్రీరామునిసంబంధమైన, పరతత్త్వ = యథార్థస్వరూపము యొక్క (బ్రహ్మస్వరూపముయొక్క), ధ్యానమున్ = ధ్యానించుటను, నాచ్చినభక్తితోన్, చేయుంనాహనుమంతున్, మదభీష్టార్థంబు మత్ = నాచేత, అభీష్ట = కోరఁబడిన, అర్థంబు = విషయము, సిద్ధింపఁగన్ = సిద్ధించునట్లుగా (ఈగ్రంథము నిర్విఘ్నముగాఁ బరిసమాప్తి యగుటకై యనుట.) సముపాశ్రయింతున్ = ఆశ్రయించెదను.

తా. మిగుల భక్తిగలవాఁడై తన శరీరముచే శ్రీరామపాదసేవయును వాక్కుచే దన్నామస్మరణంబును మనస్సుచే బరమార్థస్వరూపధ్యానంబును గావించుచుఁ ద్రికరణశుద్ధిగా నాశ్రీరాముని సేవించుచున్న యాహనుమంతుని భక్తాగ్రేసరుని నాశ్రయించెదను. అవ్విభుఁడు నాకభిమతార్థముల సమకూర్చుచు గాక!

అవ. "యస్య దేవే పరాభక్తిః యథా దేవే తథా గురౌ" = "ఎవనికి దేవుని యందు అధికముగ భక్తియుండునో, గురువునందుఁ గూడ నట్లే యుండునో వానికిని" అను న్యాయము ననుసరించి కవి గురువుల నుతించుచున్నాఁడు:—

క. ఆరయ మద్బాల్యంబున, గారవమునఁ జిత్తశుద్ధికరముగ నాకుం [న్.
దారకయోగముఁ దెలిపిన, నారాయణగురువులనుమనంబునఁగొలుతు

టీ. అరయన్ = విచారింపఁగా (లేక, పరతత్త్వస్వరూపమును విచారించుటకు, విచారించుశక్తిగలుగుటకు), మద్బాల్యంబునన్-మత్ = నాయొక్క, బాల్యంబునన్ = బాల్యమునందు ('చెప్పిన విషయములను గ్రహించి వానిని మనస్సునందు నిలుపుకొనఁ గలవాఁడు బాలుఁడు' అనువాక్యము ననుసరించి యిచ్చట బాల్యశబ్దమునకు అర్థము చెప్పవలయును. లేకున్న బాలుఁడు వేదాంతశాస్త్రోపదేశమునకుఁ దగియుండఁడుగదా!,) గారవమునన్ = ప్రేమతో, చిత్తశుద్ధికరముగన్ = మనసును బరిశుద్ధము చేయునట్లుగా, నాకున్, తారకయోగమున్ = అక్షిపురుషు నుపాసించువిధమును (యోగస్వరూపము ఈ ప్రథమాశ్వాసమునందు వివరింపఁబడును.) తెల్పిన నారాయణగురువులను = ఉపదేశించిననారాయణుఁ డనుగురువును, మనంబునన్ = మనస్సునందు, తలఁతున్ = స్మరించెదను.

తా. నేను బ్రహ్మవిద్యార్థి నై యున్నకాలమున నన్ననుగ్రహించి మనసును బరిశుద్ధము చేయఁజాలుతారకయోగము నుపదేశించి పరమార్థతత్త్వమును దెలిసికొనుట యందు శక్తిని గలిగించిన నారాయణగురువును మదిలోఁ దలంచెదను.

అవ. మఱియొకగురువునకు వందన మాచరించుచున్నాఁడు.—

సీ. ఘనపాపమును మాపఁ దనుతాపమును బాపఁ
దనరూపమును జూపఁ దనరువాని
దనుకాయమును ద్రోయఁ బెనుమాయ నొగి మాయ
ముగఁ జేయ గుఱి డాయఁ దగినవాని
మును కారణశరీరమును జీఱ నవికార
వరకారణముఁ జేరఁ బరఁగువానిఁ
దనయందు జగమందుఁ దాఁ బొందుగా నొందు
చెలు వొందువిందుగాఁ దెలియువాని
తే. నిగమనిగదితసుగుణము లగణితముగ
మిగుల నిగుడఁగ సగుణుఁడై యగుణుఁ డగుచుఁ
బగలు రే యన కొకరీతి నెగడువాని
శ్రీమహాదేవగురుని భజింతు నెపుడు. 8

టీ. ఘనపాపమునున్ = అధికమైనపాపమును (బ్రహ్మజ్ఞానమునకుఁ బ్రతిబంధకములై యుండువానిని), మాపన్ = పోఁగొట్టుటకును, తనుతాపమును = శరీరమునందలి

సంతాపములను (ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము అను తాపత్రయమును; వాతపైత్త్యాదులవలనఁ దనకుఁ గలుగు వ్యాధులు ఆధ్యాత్మిక తాపము, ఇతరజంతువులవలనఁ గలుగుబాధ యాధిభౌతిక తాపము; ఎండ వాన గాలి మొదలగువానివలనఁ గలుగు తాపము ఆధిదైవిక తాపము అని యెఱుఁగునది.), మాపన్ = నశింపఁజేయుటకును, తన రూపమును = తనయథార్థస్వరూపమును (బ్రహ్మస్వరూపమును), చూపన్ = కనఁబఱుచుటకును (అపరోక్షబ్రహ్మసాక్షాత్కారమును గలిగించుటకు), తనరువానిన్ = శక్తిగలవానిని, తనుకాయమును = సూక్ష్మశరీరమును, త్రోయన్ = నశింపఁజేయుటకుఁగా (హృదయగ్రంథిని ఛేదించుటకు, అనఁగా: తనకంటె బ్రహ్మము వేఱనుభ్రాంతిని తొలఁగించుకొనుటకు), పెనుమాయన్ = గొప్పదియగునట్టి (సకలలోకములను దనవశములను గావించుకొని త్రిప్పునట్టి సామర్థ్యము గల) మాయను, ఒగిన్ = సంపూర్ణముగ, మాయముగన్ = కనుపడనిదానినిగా, చేయన్ = చేయుటకును, గుఱిడాయతగినవానిన్ = లక్ష్యముగా నాశ్రయింప నర్హుండైనవానిని (ఈయన నాశ్రయించిన హృదయగ్రంథియు, అవిద్యయు నశించుట కేసంశయమును లేదనుట.), మును = మొట్టమొదట, కారణశరీరమును = అవిద్యాస్వరూపమైన కారణశరీరమును, జీఱన్ = నశింపఁజేయఁగాను, అవికారపరకారణమున్ = నిర్వికారమగు నుత్తమమైన పరబ్రహ్మమును, చేరన్ = పొందుటకును, పరఁగువానిన్ = తగినవాని (లేక, సమర్థుఁడగువానిని), పరబ్రహ్మమును అపరోక్షానుభవపూర్వకముగఁ దెలిసికొనినవానిని, తనయందున్ = తనలో, జగము = ప్రపంచము (కలదు). అందు = ఆ ప్రపంచమునందు, తాన్ = తాను, పొందుగా నొందు చెలువున్ = బాగుగా నొందునట్టిసమృద్ధిని (తా నా ప్రపంచమునం దుండుటను), ఒందువిందుగాన్ = ఒందుచున్న సంతోషముతో, తెలియువానిన్ = తెలిసికొనువానిని (తనయందు ప్రపంచ మున్నదనియు, తా నా ప్రపంచమం దున్నాఁడనియు బాగుగఁ దెలిసికొనియున్నవానిని), నిగమ . . . ములు = నిగమ = వేదములందు, నిగదిత = చెప్పఁబడిన, సుగుణములు, అగణితముగన్ = లెక్కకుమిక్కిలియై, మిగులన్ = అధికముగ, నిగుడఁగన్ = నిలిచియుండుటచేత, సగుణుఁడై = గుణవంతుఁడై, అగుణుఁడు = నిర్గుణుఁడు, అగుచున్ (పరబ్రహ్మరూపముతో వర్ణింపఁబడుచుండుటచే నిట్లు చెప్పఁబడినది.), పగలు రే యనక = పగలు రాత్రి అను భేదములేక (కాలపరిచ్ఛేదమనఁగా ఈకాలమునఁ గలఁడు, మఱియొక కాలమున లేఁడు అను భేదము లేక), ఏకరీతిన్ = ఒకటేవిధముగా, నెగడువానిన్ = విహరించువానిని, శ్రీమహాదేవగురునిన్ = శోభాయమానుఁడగు మహాదేవుఁ డనుగురువర్యుని, ఎప్పుడున్, భజింతున్ = సేవించెదను.

తా. బ్రహ్మజ్ఞానమునకువిఘ్నములై యుండు నానావిధములగు పాపములను నశింపఁజేయుచు, ఆధ్యాత్మికాదితాపములను బోఁగొట్టి తనసత్యస్వరూపమును బ్రత్యక్షముగ

చూపఁగలసామర్థ్యము గలవాఁడును, సూక్ష్మశరీరమును ధ్వంసము చేసి అవిద్యను తొలఁగించి కృతార్థులుగాఁ దలంచువారలకు శరణ్యుఁడును, కారణశరీరమును ధ్వంసము కావించి నిర్వికారపరబ్రహ్మముతో నైక్యముఁ జెంది యుండువాఁడును. "మయ్యేవ సకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితం, మయి సర్వం లయం యాతి తద్బ్రహ్మాద్వయమస్మ్యహమ్" "ప్రపంచము నాయందే జనించినది. నాయందే నిలిచియున్నవి. నాయందే లయమగును. సర్వకారణభూతుఁడగు పరబ్రహ్మము నేనే" అనువిషయమును జక్కఁగ నెఱిఁగి యున్నవాఁడును, నిర్గుణస్వరూపుఁడగుటయు శాస్త్రోక్తములగు సకల సద్గుణములును గలవాఁ డగుటచే సగుణుండై కూడ నుండువాఁడును, కాలపరిచ్ఛేదము లేక యొకరీతిగ నుండువాఁడునగు నామహాదేవగురువును సేవించెదను. (ఈకవికి నారాయణుఁడు అనియు, మహాదేవుఁడనియు నిరువురు గురువులు. అందు నారాయణుఁడు పై పద్యమున వర్ణింపఁబడి యున్నాఁడు. ఈపద్యమున మహాదేవగురువు విజ్ఞానవంతుఁడుగఁ గొన్నిచోట్లను గేవల పరబ్రహ్మరూపుఁడుగ మఱికొన్నిచోట్లను వర్ణింపఁబడి యున్నాఁడని తెలిసికొనవలయును.)

## సంస్కృతకవిస్తోత్రము

అవ. ఈక్రింద నాలుగుపద్యములచేఁ గవిప్రశంస చేయుచున్నాఁడు.—(ఇది యాంధ్రకవులయాచారము),

శా. లోకాలోకపరీతభూచరమహాలోకోపకారంబుగా
శ్రీకల్యాణకరోరుకావ్యచయముల్ సిద్ధంబుఁ గావించి సు
శ్లోకుల్ పుణ్యమతుల్ జగద్గురువులై శోభిల్లుచున్నట్టి వా
ల్మీకివ్యాసమయూరబాణకవికాళీదాసులం గొల్చెదన్. 9

టీ. లోకా ... ఉపకారంబుగాన్ - లోకాలోక = చక్రవాళపర్వతమువఱకు (ఇది 'సప్తసముద్రములకు అవల నున్న పర్వతపంక్తి' అని పౌరాణికులు చెప్పుదురు. ఈ లోకాలోకపర్వతముల కావల భూమి లేదు.) పరీత=వ్యాపించిన, భూ = భూమియందు, చర=సంచరించుచున్న, మహాత్ =అధికమైన (లెక్కకు మిక్కిలి యగు,) లోక=జనులకు, ఉపకారంబుగాన్ = ఉపకార మగునట్లుగా, శ్రీ ... చయముల్ - శ్రీ = శోభాయుక్తము లైనవియు (ప్రసిద్ధిఁజెందిన), కల్యాణకర = శుభమును కలిగించునవియు (జ్ఞానము నొసంగునవి యనుట.) ఉరు = విశాలములయినవియునగు, కావ్య=రామాయణము మొదలగుకావ్యములయొక్క, చయముల్ = సమూహములను, సిద్ధంబుఁగావించి= నిర్మించి, సుశ్లోకుల్=చక్కనికీర్తి గలవారును ('పద్యే యశసి చ శ్లోకః' శ్లోకమనఁగాఁ బద్యము, కీర్తి' అని అమరము.) పుణ్యమతుల్ = నిర్మలమైన హృదయములు గల

వారును, జగద్గురువులు = త్రిభువనములకును గురువులును, ఐ=అగుచు, శోభిల్లుచున్నట్టి, వాల్మీకి వ్యాస మయూర బాణకవి కాళిదాసులన్ = వాల్మీకి వ్యాసుఁడు మయూరుఁడు బాణుఁడు కాళిదాసుఁడు మొదలగుసంస్కృతకవులను, కొల్చెదన్ = సేవించెదను (కొనియాడెద ననుట.)

తా. సకలజనులకును పరిపూర్ణజ్ఞానము నొసంగుచుఁ బరలోకసౌఖ్యములను గూడఁ గలిగించుచు మిగులఁ బ్రసిద్ధిఁ జెందియున్న విశాలము లగుకావ్యముల నిర్మించి సప్తసముద్రముద్రిత మగునీభూమండలమునం దున్నవారల కందఱకు మహోపకారమును గావించి లోకగురువులై పరిశుద్ధము లగుచిత్తములతో రాణిల్లుచుఁ దమకీర్తిచే లోకముల నెల్లఁ బావనముఁ జేయుచున్న వాల్మీకి వ్యాస మయూర బాణ కాళిదాసాదుల నభినుతించెదను.

## సుకవివర్ణనము

తే. మహితగురులఘువర్ణధర్మములు నియమ
ములుఁ గలితకర్తృకర్మక్రియలను దెలిసి
నామరూపావ్యయవిలక్షణంబు లాత్మ
నెఱిఁగినకవీశ్వరుండె కవీశ్వరుండు. 10

టీ. మహిత . ములు- మహిత = ఒప్పుచున్న (లేక, గౌరవార్హములైన) గురు = గురువులును, లఘు=లఘువులైనట్టియు, వర్ణ = అక్షరములయొక్క ('దీర్ఘస్సంయుక్తాద్యశ్చ పూర్ణానుస్వారపూర్వవర్ణశ్చ" దీర్ఘమును, విసర్గలున్నయక్షరమును, సంయుక్తాక్షరమునకును బూర్ణానుస్వారమునకును ముందున్నయక్షరమును గురువు లనఁబడును. మిగిలినవి లఘువులు.) ధర్మములు = స్థితులును, నియమములు=యతిప్రాసనియమములును, కలిత... క్రియలను-కలిత = ఒప్పుచున్న, కర్తృ=కర్తలను, కర్మ=కర్మలను, క్రియలను = ధాతువులను, తెలిసి= తెలిసికొని, నామ...లక్షణంబులు - నామ = ప్రాతిపదికములయొక్కయు, (ప్రాతిపదిక మనఁగా విభక్తిప్రత్యయములుగాని, వానికి సంబంధించిన వికారములుగాని కలుగక ముందున్నశబ్దరూపము; రామ, కృష్ణ మొ.) రూప=విభక్తిరూపములయొక్కయు అవ్యయ = అవ్యయములయొక్కయు, విలక్షణములన్ =చక్కనిలక్షణములను (అనఁగా: స్వరూపములను), ఆత్మన్ = తనలో, ఎఱిఁగిన కవీశ్వరుండె = తెలిసికొనిన కవీశ్వరుఁడె, కవీశ్వరుండు=కవి యనుటకుఁ దగినవాఁడు.

ఈపద్యమునందు బ్రహ్మవేత్తృపరముగ మఱియొకయర్థము కూడ స్ఫురించుచున్నది:—

టీ. గురు...ధర్మములు గురు = ఉత్తములును, లఘు = అధమములైన, వర్ణ = జాతులయొక్క, ధర్మములు = ఆచారనియమములను, నియమములు = యోగాంగము

లగుశౌచము, తపస్సు మొదలగువానిని (నియమము లనుటచే యోగము సమగ్రముగ అని అర్థము. కేవలము నియమములుమాత్రమె తెలిసికొనుటవలన నంతప్రయోజనము లేదుగదా.) కలిత కర్తృ కర్మ క్రియలను - కలిత = ఒప్పుచున్నట్టి (అనఁగా: ప్రసిద్ధము లైన), కర్తృ=చేయువాఁడు, కర్మ=చేయఁబడినది, క్రియ = చేయుట అను వానిని (వీనియథార్థస్వరూపము నచుట. ఇచ్చట 'క్రియ' అనఁగా ఫల మని కొందఱు. అది విచారింపవలసియున్నది), తెలిసి, నామరూపా...ముల - నామరూప = నామరూపములయొక్కయు (అనఁగా: నామరూపాత్మక మగు నీప్రపంచముయొక్కయు, అవ్యయ = ఈ నామరూపములవలన వికారముఁబొందని పరబ్రహ్మముయొక్కయు, విలక్షణములన్ = చక్కనిలక్షణములను, ఆత్మకన్ = తనలో, ఎఱిఁగిన కవీశ్వరుండు = తెలిసిన పండితోత్తముఁడె (ప్రపంచము మిథ్య యగుటచేత అది సర్వకాలములయందును గనఁబడుచునే యుండును గావునను, పరబ్రహ్మము తనకంటె వేఱైనవాఁడు గావున నచ్చటఁ జేయవలసినకార్య మేదియును లేకపోవుటచేతను, ఈప్రపంచబ్రహ్మములలక్షణములఁ జక్కఁగ నెఱుఁగుటయె పురుషార్థమని భావము.), కవీశ్వరుఁడు = పండితశ్రేష్ఠుఁడు (బ్రహ్మజ్ఞాని యనఁదగినవాఁ డనుట.)

తా. గురువులు, లఘువులు, యతిప్రాసములు, కర్తృ కర్మ క్రియలు, ప్రాతిపదికములు, విభక్తిరూపములు, అవ్యయములు మొదలగువానిధర్మముల బాగుగ నెఱింగి చక్కఁగఁ బ్రయోగింపఁ గలకవియె కవి. (బ్రహ్మవేత్తృపరమునందు) మాయాకల్పిత మగు ప్రపంచముయొక్కయు నిర్వికారుఁడగు పరమాత్మయొక్కయు లక్షణముల బాగుగ నెఱింగి భ్రాంతిరహితుఁడై, చేయువాఁడు, చేయుట, చేయఁబడునది అను త్రిపుటియొక్క యథార్థతత్త్వమును (అనఁగా: ఈత్రిపుటి పరబ్రహ్మమునకంటె వేఱు కాదనువిషయమును, లేక, దీనినలనఁ గలుగుఫలము లనిత్యములు గావున ఈకర్తృత్వాదులను బరిత్యజింపవలయు ననుటను) బాగుగ నెఱింగి చిత్తము స్థిరమగుటకై (లేక, పరమానందానుభవ మెప్పుడు జరుగుచుండుటకై) ధ్యానయోగము నాచరించుచు "నైవ తస్య కృతే నార్థో నాకృతే నేహ కశ్చన" "జ్ఞాని కర్మనుజేసినను జేయకున్నను సమానమే" అను గీతావాక్యము ననుసరించి తన కెట్టున్నను బాధ లేదు గాన లోకసంగ్రహము కొఱకై (అనఁగా: లోకులను జక్కనిమార్గమునందు నడిపించునిమిత్తముగ తనకులమున కుచిత మగు ధర్మముల బాగుగ తెలిసి యాచరించుచు నుండు బ్రహ్మజ్ఞానియె బ్రహ్మజ్ఞాని. ఇతరులు లోకవంచకులు.

వ. అట్లు కావునన్. 11

టీ. అట్లుకావునన్ = పైపద్యమునందు చెప్పఁబడినవాఁడె కవీశ్వరుఁడుగావున.

